## కైలాసగౌరి నోము

పూర్వము ఒక రాజ్యములో మహారాజు తన కుమార్తెను అతి గారాబముగా పెంచి పెద్ద దానిని చేశాడు. యుక్త వయస్సు రాగానే దేశ దేశాలు గాలించి అత్యంత సుందరాంగుడిని వెతికి అతనితో తన కుమార్తెకు అత్యంత వైభవంగా వివాహం జరిపించాడు. రాజు కుమార్తె అత్తవారింటికి వెళ్ళింది. ఆమె భర్త వేశ్యాలోలుడు. భార్యను సరిగా చూసేవాడు కాదు భర్త అనురాగానికి దూరమై ఆమె ఎంతగానో దు:ఖిస్తుండేది. మహారాజు కూడా ఎంతగానో బాధపడేవాడు. తన బిడ్డ బ్రతుకుని సరిదిద్ద వలసినదిగా పరమేశ్వరరుడిని ప్రార్ధించేవాడు. ఆ చిన్నది సైతం తన బ్రతుకు బాగుకై పార్వతి దేవిని నిరంతరం ప్రార్ధిస్తుండేది.

ఒకనాటి వేకువజామున ఆ పార్వతీదేవి ఆమెకు కలలో కనబడి బిడ్డా! కైలాస గౌరినోము నోచుకో నీ బ్రతుకు సరియౌతుంది. నీవు నీ భర్త అనురాగాన్ని పొందగాలుగుతావు అని చెప్పింది. ఆ ప్రకారం రాకు కూతురు కైలాస గౌరీ నోము నోచింది. అందుకు ఫలితంగా ఆమె భర్తకు, వెలయాలిపై మమతానురాగాలు తొలగిపోయాయి. ఉంపుడు గత్తెల కపట ప్రేమ పట్ల అసహ్యత కలిగింది. భార్యపట్ల ప్రేమ సంతృప్తి కలిగింది. ఆనాటి నుండి రాజు కుమార్తె ఆమె భర్తే యొక్క అనురాగం పెంపొంది ఆమె సంసార యాత్ర సుఖంగా జరుగుతుండేది. వారిని చూచినా వారు పార్వతీ పరమేశ్వరులని ప్రశంసిస్తుండేవారు.

ఉద్యాపన: పార్వతీ దేవి ఆలయంలో గాని నదీ తీరమునందుగాని అయిదు కుంచాల కుంకుమ అయిదు కుంచాల పసుపు ముత్తైదువులకు దక్షిణ తాంబూలాలు పుష్పములతో పంచిపెట్టి వారి ఆశీస్సులు పొందాలి.

(అనుకూల దాంపత్యం సౌభాగ్యలాభం)



## 10. కైలాసగౌరి నోము

**కథ :-** అన్ని విధాలా ధర్మాత్ముడయిన ఒక మహారాజు - ఏ కారణంవల్లనో వేశ్యల సాంగత్యంలో పడి, సుందరాంగీ - సౌశీల్యవతీయైన భార్యను ఉపేక్షించ సాగాడు. అందర్నీ ఆదరించే ఆ మహాపురుషుడి అనురాగం తనకు కాకుండా పోయినందుకా రాణీ యెంతగానో దుఃఖించేది. ఒనాడు పార్వతీదేవి ఆమె కలలో కనబడి "గతంలో నువ్వొకసారి కైలాసగౌరి నోము పట్టి ఉల్లంఘించడమే, యీ కష్టానికి హేతువు. మళ్ళీ ఆ నోము పట్టి భక్తి శ్రద్ధలతో ఉద్యాపన చేసుకొంటే, నీ భర్త సానిసంపర్కాన్ని మానివేస్తాడు. తిరిగి నీ యింటికే వస్తాడు. నీ సంసారం మూడుపువ్వులుగా ఆరుకాయలుగా వర్థిల్లుతుంది". అని ఆదేశించించింది. మేల్కొంచిన తరువాత రాణీ - స్వప్నాన్ని గుర్తు చేసుకొని నోము పట్టి, ఉద్యాపన చేసుకోగా, అనతికాలంలోనే ఆమె భర్త వేశ్యా సంపర్కాన్ని వదిలి - రాణీ పట్ల అనురాగంతో ప్రవర్తించి, దేశమంతటా మరింత గొప్ప రాజుగా కీర్తి పొందాడు.

**విధానం :-** రోజూ ఉదయమే కథ చెప్పుకొని అక్షతలు వేసుకోవాలి. 6 నెలలు గడిచాక ఉద్యాపన చేసుకోవాలి.

**ఉద్యాపన :-** 7వ నెలలో వచ్చే పర్వ - పండుగదినాలలో పార్వతీ ఆలయంలో గాని, పరిశుభ్రమైన జీవనదీతీరంలో గాని - 5 కుంచాల కుంకుమా - 5 కుంచాల పసుపు - తగినన్ని పండ్లూ, తమలపాకులూ, పోకచెక్కలూ పెట్టుకొని ఒక్కొక్క ముత్తయిదువకూ 1 చారెడు కుంకుమ, 1 చారెడు పసుపు, 1 పండు, 1 తాంబూలం (5 తమలపాకులూ + 2 పోకచెక్కలూ - 1 తాంబూలం) చొప్పున, తెచ్చిన పసుపు కుంకాలయిపోయేవరకూ పంచిపెట్టుకోవాలి.

# 6 కైలాస గౌరీ నోముకథ

ఒక రాజునకు ఒక్కతే కుమార్తె గలదు. అతడామెకొక వన్నెల విసనకఱ్ఱవంటి వయ్యారి మగనిని యేరితెచ్చి పెండ్లి చేసినాడు. కాని, ఆమెభర్త యెల్లప్పుడు వేశ్యాలోలుడై భార్యముఖమైనను చూడకుండెను. అందుచే ఆ రాచచిన్నది మిక్కిలి బాధపడి పార్వతీ దేవిని ప్రతిదినము పూజించుచు, అతనిని తనతో కలుపమని ప్రార్ధించుచుండెను. అట్లు కొంతకాలము జరిగిన తరువాత పార్వతీదేవి ఆమెయందు కరుణించి ఒకనాటి రాత్రి ఆమె స్వప్నములో కనిపించి, 'కైలాసగౌరి నోము నోచినచో భర్తతో యెడబాటు లేకుండు'నని తెలిపెను. తెల్లవారిన తర్వాత, ఆమె గతరాత్రి స్వప్న వృత్తాంతము తన తండ్రికి తెలిపి ఆనోము నోచుకొనెను. తర్వాత ఆమెభర్త ఆమెయందనురాగము గల వాడై, వేశ్యానుబంధము వదులుకొనెను. అప్పటినుండి వారిద్దరూ పార్వతీపరమేశ్వరుల వలె జంట విడువక సుఖముగా నుండిరి.

ఉద్యాపనము : పండుగ దినమున పార్వతీ దేవాలయమునందు, లేక, నదీతీరమునందు ఐదు కుంచముల కుంకుమ - అయిదు కుంచముల పసుపు - పండ్లు ముత్తయిదువులకు పంచిపెట్టవలెను.